# పరమగురుచరణసన్నిధి

ఆల్కియోని (జి. కృష్ణమూర్తి)

చే నాంగ్లేయభాషను రచియింపఁబడి

చిట్టమూరు రామయ్య, బి. ఏ., ఎల్. టి.

గారిచే నాంధ్రీకరింపఁబడినది.

మూడవ కూర్పు ప్రకటింపబడినది

*VASANTA INSTITUTE*, ADYAR, MADRAS

**1921**

# పీఠిక

పెద్దనైయుండుటంబట్టి యీచిన్న గ్రంథమునకు పీఠిక వ్రాయు భాగ్యము నాకు గలిగెను. ఇది శరీరమున బాలుఁడుగనుండియు, పరిపక్వమయిన జీవుఁడగు నొక చిన్నసోదరుఁడు రచించిన ప్రథమగ్రంథము. వారిని జ్ఞానదీక్షను వహింపనర్హునిగఁజేయుటకు నిందలి విషయముల పరమగురువులు వారి కుపదేసించినవి. ఆవిషయములను వారు శ్రమతో మెల్లమెల్లగ జ్ఞప్తికిఁదెచ్చుకొని యింగ్లీషుభాషలో వ్రాసిరి. ఏలయన గడచిన వత్సరమున (1909) వారి కాంగ్లేయభాషాధోరణి యిప్పటికంటె మిగుల నల్పముగనుండెను. చాల మట్టుకు పరమగురువుల మాటలే యిందు వ్రాయఁబడియున్నవి.: అచ్చటచ్చట వారి సొంతమాటలు కానిచో వారి యభిప్రాయము శిష్యుని మాటలతో వ్రాయఁబడినది. వారి వాక్యములలో రెండుమా

త్రము విడిచిపోయియుండ వానిని బరమగురువులు పూర్తిచేసిరి. మఱి రెండు స్థలములలో నొక్కొక్క మాట విడిచియుండ నదిపూర్తి చేయఁబడినది. ఇవి వినా, మిగిలిన దంతయు ఆల్క్యొని సొంతముగ వ్రాసి లోకమునకు వారొసంగిన ప్రథమగ్రంథము.

పరమగురువుల వాక్కునుండి వెలువడిన వాక్యములు శిష్యుఁడగు గ్రంథకర్త కెట్లు ఉపకారములయ్యెనో అటులనే యీగ్రంథ మితరులకు నుపకారమగుఁగాక. అట్టి మనోభీష్టముతో నిది యియ్యఁబడుచున్నది. అయిన నీ యుపదేశము పరమగురువులు వచించినది మొదలు గ్రంథకర్త యనుష్ఠించిన రీతి ననుష్ఠించినంగాని సఫలము గానేరదు. వారు చెప్పినట్లు చేసినచో గ్రంథకర్తకు మోక్షమార్గద్వారము దెఱువఁబడినట్లే చదువరులకు నయితము ఆద్వారము తెఱువఁబడి వారా మోక్షమార్గమున నడువఁగలరు.

ఆనీ బెసెంటు

మోక్షమార్గద్వారమును

తట్టువారల కిది సమర్పితము.

అసతో మా సద్గమయ.
తమసో మా జ్యోతిర్గమయ.
మృత్యోర్మాఽమృతం గమయ.

అసత్తునుండి నన్ను సత్తునకుఁ జేర్పుఁడు.
చీఁకటినుండి నన్ను వెలుఁగునకుఁ జేర్పుఁడు.
మృత్యువునుండి నన్నమృతత్వమునకు నడుపుఁడు.

ఓమ్

# "పరమగురుచరణసన్నిధి."

## ఉపోద్ఘాతము.

ఇందు వ్రాయఁబడునవి నా మాటలు గావు. నా కుపదేశించిన పరమగురువుమాటలు. వారు లేని యెడల నేనేమియు చేసియుండఁజాలను, గాని వారి సహాయముచే నేను మోక్షమార్గమును బ్రవేశించితిని. నీవును అదేమార్గము ప్రవేశింప నిచ్ఛగలవాఁడవు. కావున వారు నా కుపదేశించిన వాక్కులు నీకును సహాయములుగ నుండును. ఆమాటలను అనుష్ఠించవలెను సుమా! ఆమాటలు

సత్యము లనియును, రమణీయము లనియును చె
ప్పుట చాలదు. చెప్పినప్రకారము జవదాఁటక
యనుష్ఠించినఁగాని నీవు కడతేరఁజాలవు. ఆహార
మును చూచి యది బాగుగా నున్నదనుటచే
నాఁకొనియున్న వానియాఁకలి తీరదు. చేయిచాఁ
చి యాయన్నము దినవలయునుగదా! అటులనే
పరమగురువుల వాక్కుల వినుట చాలదు. వారు
చెప్పు నొక్కొక్కమాటయు గమనించి వారు
సూచించు నొక్కొక్క యంశమును గ్రహించి
వారు చెప్పునటుల నడుచుకొనవలయును. వారి
సూచనలలో నొక్కటిగ్రహించకపోయినను, వారి
మాటలలో నొక్కటి విడిచినను, అది యెప్పటికిని
పోయినదే. వారుచెప్పినది మరల చెప్పరు సుమా.

ఈ మార్గమున నాలుగుసాధనము లున్నయవి.
1 వివేకము. 2 నిష్కామత్వము (విరాగము).
3 సదాచారము. 4 ప్రేమ. వీనిలో నొక్కొక్కదా

నిని గుఱించి నాకు పరమగురు వేమి యుపదేశిం చిరో దానిని నీకుఁజెప్పఁబూనెద.

---

I

# వివేకము.

ఇందు మొదటిసాధనము వివేకము. ఇది మోక్షమార్గమునఁ జేర్చు సదసద్వివేకమని వాడుట కలదు. ఇదిసరియే. ఐనను దీనియందు మఱికొంత గొప్పవిశేషమున్నయది. ఆమార్గారంభముననే గాదు, అడుగడుగునను ప్రతిదినమునను అభ్యసింపఁదగినది. పొందఁదగిన వస్తువులన్నియు నామార్గముననే లభించునని నేర్చితివి గావున నీ వీ మార్గమునఁ బ్రవేశించితివి. తెలియనివారు ధనమును గూర్చియు అధికారముకొఱకును పాటుపడుదురు

గాని యవియెంత కాలముండిన నొక్క జన్మముతో విడిచిపోవును. కాఁబట్టి యవి అసత్తులు. సత్తులును నిత్యములునయి వీనికంటె నధికమైనవస్తువులు గలవు. వీని నొకతూరి చూచినచో నీ వితరవస్తువుల మరల కోరవు.

ప్రపంచమునందలి మనుజులందఱు రెండే రెండు తెఱఁగులవారు—తెలిసినవారు, తెలియనివారు. ఈ తెలివియొక్కటియే ముఖ్యమైనది. ఏమతము నవలంబించువాఁడైనదియు నేజాతివాఁడైనదియు ముఖ్యముగాదు. నిజముగ ముఖ్యమైనది యీ జ్ఞానమే. మానవులనుగుఱించి యీశ్వరుఁడు చేసిన కట్టుబా టిట్టిదని తెలిసికొనుటయే జ్ఞానము. భగవంతుఁ డట్టి కట్టుబాటు చేసియున్నాఁడు. అదియే ప్రపంచము పురోవృద్ధికి వచ్చు మార్గము. ఎవరు గాని యామార్గ మిట్టిదని చూచి వాస్తవముగఁ దెలిసికొనినచో, నతితేజోవంతమును అతిర

మణీయమును నగు నా మార్గమున పాటుపడి యామార్గముతో నేకీభవింపక యుండనోపడు. ఇట్లు ఉంగుటవలన వాఁడు భగవంతుని పక్షమున చేరును. ధర్మము నవలంబించి యధర్మము నెదిరించును. లోకముయొక్క శ్రేయస్సుకొరకు పాటుపడును. స్వప్రయోజనము నపేక్షింపఁడు.

ఇట్లు భగవంతుని పక్షమున నుండినచో నాతఁడు మాలోనొక్కఁడగును. హిందువనిగాని, బౌద్ధుఁడనిగాని, క్రైస్తవుఁడనిగాని మహమ్మదీయుఁడనిగాని పేరుపెట్టుకొన్నను, హిందూదేశవాసియైనను, ఆంగ్లేయదేశవాసియైనను, చీనాదేశస్థుఁడైనను, రష్యాదేశపువాఁడైనను, భేదమించుకయైనను లేదు. భగవంతునిపక్షమున నుండువారలు ఏకారణమున ఈ లోకమునకు వచ్చిరో తామేమి చేయవలయునో దానినెఱింగి దానింజేయఁబూనుదురు. తక్కినవారలందఱు దామేమిచే

యవలయునోదాని నింకను నెఱుంగక పోవుటం జేసి తెలుచుగ నవివేకముగ నటించుచు, నందఱు నొక్కటియనియును, ఒక్కఁడేయగు భగవంతు నిచ్ఛయే యెపుడుగాని యందఱకును యథార్థముగ ప్రియముగ నుండనోపుననియు నెఱుంగక, తమకుమాత్రము ప్రియమనితోఁచుమార్గముల కల్పింపఁబూనుదురు. అట్టివారందఱు అసత్తును అనుసరించు వారలుగాని సత్తుననుసరించుట లేదు. ఈ రెంటికిం గల తారతమ్యము నెఱుంగునంతగ నుక వారు భగవంతునిపక్షమున చేరినవారు కారు. కావున నీవివేకము మొదటిమెట్టు.

ఇట్లు నిశ్చయించిన వెనుకను, సదసత్తులలో ననేకభేదము లున్నవని మఱువకుము. సరియిది యనియు, తప్పు ఇదియనియును, ముఖ్యమిదియనియును, అముఖ్యమిదియనియును, ఉపయోగకరమిదియనియు, వ్యర్థమిదియనియును, సత్యమిదియని

యు, అనృతమిదియనియును, స్వప్రయోజనమిది యనియు, పరోపకారమిదియనియును వివేకముతోఁ దెలిసికొనుట యింకను మిగిలియే యుండును.

తప్పును విడిచి సరియైన దాని నవలంబించుట కష్టముగఁదోఁచరాదు. ఏలయనఁగా పరమగురువు ననుసరించఁగోరువా రెన్నికష్టములైననుపడి, సరియయినదానినే యవలంబించవలయునని ముందే నిశ్చయము చేసికొనియుందురు. అయినను నీశరీరము వేఱు, నీవు వేఱు. నీయిచ్ఛ యెల్లప్పుడును నీశరీరము కోరుదానిననుసరించి యుండదు. నీశరీర మెద్దియైనను గోరినచో నది యథార్థముగ నీవు గోరునదియగునాయని నిలిచి యోచింపుము. నీవీశ్వరుఁడవే. ఈశ్వరుఁడిచ్ఛయించునదియే నీవును నిచ్ఛయింతువు, గాని నీవు నీయంతరంగమును లోఁతున దిగి శోధించి నీలోనుండు నీశ్వరునిం

గనుఁగొని[1] వానిమాటను దెలిసికొనవలయును సుమా! అదియె నీమాట. నీశరీరములే నీవను పొరబాటుపడకుము. స్థూలశరీరము నీవు కావు. కామమయశరీరము[2] నీవు కావు. మనోమయశరీరము నీవు కావు. ఇవి యొక్కొక్కటియుఁ దనకుఁ గావలయువానిని బొందుటకుఁ దానే ఆత్మయని నటించును. అయినను వానినన్నిటిని దెలిసికొని వానికన్నింటికిని స్వామి నీవని యెఱుంగుము.[3]

[1] కశ్చిద్ధీరః ప్రత్యగాత్మానమైక్షత్ ఆవృత్తచక్షురమృతత్వమిచ్ఛన్. ఒకానొక ధీరుఁడు అమృతత్వమును గోరినవాఁడై దృష్టిని లోపలికిఁ ద్రిప్పి ప్రత్యగాత్మను (లోపలనుండు ఆత్మను) చూచును.—కఠోపనిషత్తు. ౪. ౧.

[2] ఈ కామమయ మనోమయ శరీరములు రెండును జేరి మనోమయకోశమని వేదాంతులు చెప్పుదురు.

[3] ఇదం శరీరం కౌంతేయ క్షేత్రమిత్యభిధీయతే। ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః ॥ ఈశరీరమునకు క్షేత్రమని పేరు. దీనిని దెలిసికొనువాఁడు క్షేత్రజ్ఞుఁడు (జీవుఁడు) అని తెలిసినవారు చెప్పుదురు.—గీత, అ ౧౩.

చేయవలసిన పనియుండఁగా శరీరము శ్రమతీ ర్చుకొనవలెననిగాని, తిరుగఁబోవలెననిగాని భో జనపానములు చేయవలెననిగాని కోరును. తెలి యనివాఁడు ‘ఇవియన్నియు నేను గోరెదను, నేను పీనిం జేయవలెను’ అనుకొనును. తెలిసినవాఁడు ‘వీనింగోరునది నేను గాదు. ఇది కొంత కాల మట్లుండనిమ్ము’ అనును. ఎవరికైన సహాయము చేయుట కవకాశము గలిగినపుడు శరీరము ‘అది నాకెంతో శ్రమ, మరియెవ్వరైన చేయుదురుగాక’ యని పలుమరు దలంచినను ‘మంచి పనిచేయుటకు నీవడ్డమురాకుము’ అని వాఁడు శరీరమునకుఁ బ్ర త్యుత్తర మిచ్చును.

దేహము నీకు వాహనము, నీ వెక్కు గుఱ్ఱము. కావున దాని నాదరించి చక్కఁ గఁగాపాడవలయును. దానికి శక్తికిమించిన పని యియ్యరాదు. దానికి పరిశుద్ధములగు

నన్నపానములనే యిచ్చి మేప వలయును. లేశమాత్రమైన మైలలేక యుండునట్లుతి పరి శుద్ధముగ నెల్లపుడు నుంచవలెను. పరి శుద్ధియు ఆరోగ్యమును పూర్ణముగనుండు శరీ రము లేనిచో, నీవు విరామములేని శ్రమకు నోర్చి యీ కఠినమగు సాధనము చేయఁజాలవు. ఎట్ల యినను నీశరీరము నీకు నెల్లపుడును లోఁబడి యుండవలెను గాని నీవు శరీరమునకు లోఁబడి యుండరాదు.

కామమయశరీరమునకును దానికోరికలుండు ను. అవి పెక్కులు. నిన్ను కోపించుకొనుమను ను. పరుషవాక్కు లాడుమనును. ధనమునకై పేరా స పడుమనును. ఇతరులకుండునది చూచి యీర్ష్య కుండుమనును. ఖిన్నుఁడవై పరవశతనొందుమను ను. వీనినిగాక మరి పెక్కు కోరికలు కోరును. ఇట్లుకోరుట నీకుఁ గీడుచేయఁదలఁచికాదు. ఇట్ట

బలమగు తాఁకులు[1] తాఁకుటయు సారిసారికీ తాఁకులు మాఱుచుండుటయు దానికిష్టము. ఇవి యొక్కటియు నీకేమో అక్కఱ లేదు. కావున నీ కోరికలలో నీవి యెవ్వి నీ శరీరము కోరికలెవ్వి యని వివేచనము చేయవలెను.

నీ మనోమయశరీరము గర్వించి తాను వేఱని యనుకొన నిచ్ఛయించును. తానధిక మనియును, ఇతరు లల్పులనియును అనుకొనును. ఐహిక విషయములనుండి దానిని మరలించియున్నను నీ పరమగురువు కార్యమును పరోపకారమును యోచిం

1 తాఁకులు.—కామక్రోధాది మనోవికారములు గలుగునప్పుడెల్ల నీకామమయ శరీరములో నొక కంపనము (అదరుపాటు) ఉత్పత్తియగును. అట్టి కంప మా శరీరమునకు ప్రియము. మనస్సున వృత్తులు మాఱునట్లెల్ల కంపముయొక్క స్వభావము సహితము మాఱుచుండును. ఈ కంపము యోగదృష్టికిఁ గానవచ్చు. దీనివలనఁగలుగు వర్ణములను బట్టియే, యోగులగు వారితరుల మనోభావముల నెఱుంగుదురు.

చక తన మేల్మినే చింతింప చూచును. నీవు ధ్యానము చేయునపుడు నీకు వలయు నొక్కటేయగు విషయమును[1] విడిచి తనకు వలయు పెక్కువిషయముల జంతించునట్లు చేయఁబూనును. ఈ మనస్సు నీవు కాదు. అది నీ వుపయోగించఁదగిన కరణము. కావున నిందును వివేచన మావశ్యకము. నిరంతరము జాగరూకుఁడవై యుండవలెను. లేనిచో చెడుదువు.

తత్వము దెలిసినవారు సరి తప్పు అనుటను నిశ్చయించుటలో నేమియు జంకరు.[2] ఎంతనష్టము గ పైకి కనఁ బడినను నీవు సరియయినదానినే చేయవలయును, సరికానిదానిని చేయరాదు. అవివేకు

[1] మన మెద్దియో యొక విషయమును ధ్యానముచేయుచుందుముగదా! దానిని విడిపించి వేఱువిషయములకు మనలను ద్రిప్పును.

[2] అనఁగా నేది చేయవలయునను సందేహము గలుగఁజాలదు.

లేమని తలంతురో, యేమని చెప్పుదురో అని సర కు చేయకుము. గుహ్యాములగు ప్రకృతిధర్మములను లోఁతున దిగి పరిశీలించి నీబుద్ధిని వినియోగించి తెలిసికొని యభీష్టము లననుసరించి నీనడవడి కను గుదుర్చుకొనవలయును.

ముఖ్యమిది అముఖ్యమిదియని భేదమును వి వేచనము చేయవలయును. సరి తప్పు అను విషయ మందు కొండవలె స్థైర్యము గలిగి[1] ముఖ్యములు కాని విషయములం దెప్పుడును ఇతరుల ననుసరించి పొమ్ము. ఏలయనఁగా, నీవెల్లప్పుడును మార్దవ మును దయయును గలిగి యుండవలయును. యు క్తముగను, ఇతరులకను కూలముగను ప్రవర్తింప వలయును. అన్నింటియందును నీకెంత పూర్ణస్వా తంత్ర్యము కావలయునో అంత స్వాతంత్ర్య మిత రులకును పూర్ణముగ నిమ్ము.

[1] అనఁగా సరియయినదానిని పదలక.

చేయఁదగిన కార్యమెద్దియో తెలిసికొనుటకు యత్నింపుము. కార్యము గొప్పకార్యమా, కొద్ది కార్యమా యనుటనుబట్టియే దీనిని నిశ్చయింపరా దనుటను మఱువకుము. లోకులు మంచిదని చెప్పు గొప్పకార్యముకంటె, పరమగురుని పనికి ప్రత్యక్ష ముగ ననుకూలమగు చిన్న కార్యము చేయుట బహుయోగ్యము. మఱియును కార్య ముపయోగ కరమా నిష్ప్రయోజకమా యని విచారించుట మాత్రము చాలదు. ఉపయుక్తములగువానిలోపల నెద్ది యెక్కుడు ఉపయోగకరమో, ఎద్ది తక్కువ యో యని వివేచనము చేయవలయును. పేదల కన్నమిడుట సత్కార్యము, గొప్పదియు, ఉపయో గకరమునగు. అయినను దేహముల కన్నమిడుట కంటె వారియాత్మల కన్నమిడుట యంతకంటె గొప్పదియు ఉపయోగకరమునగును. ధనవంతుఁ డెవఁడైనను దేహమున కన్నమిడఁగలఁడు. తెలిసి

నవాఁడే ఆత్మ కన్నమిడనోపును. నీకుఁ దెలిసినచో నీవితరులకు సహాయపడి తెలుపుట నీధర్మము.

నీ విదివఱ కెంత వివేకివై యుండినను, ఈ మోక్షమార్గమున నీవు దెలిసికొనఁదగినది యెంతయో గలదు. అందుచే దీనియందును వివేచన మవశ్యకము. నేర్చుకొనఁదగిన దెద్దియో జాగరూకుఁడవై యోచించవలయును. జ్ఞానమంతయు నుపయోగకరమే. కాలపరిపాకమున నీకును జ్ఞానమంతయుఁ గలుగును. దానిలో నీకు కొంతయే యుండఁగలిగినప్పుడు, ఆ కొంతయు నీకు మిగుల నుపయోగకరమైనదిగ నుండు నట్లు చూచుకొనుము. భగవంతుఁడు జ్ఞానస్వరూపుఁడును దయాస్వరూపుఁడును. నీజ్ఞానము హెచ్చను హెచ్చను నీయందు భగవచ్ఛక్తి యెక్కుడుగ వ్యక్తము గాఁగలదు. కావున విద్యనభ్యసింపుము. అందు నితరులకు సహాయము చేయుట కుపయుక్త

మగు దానిని తొలుత నభ్యసింపుము. విసుకులేక విద్య నభ్యసింపుము. అయినను లోకులు నిన్ను పండితుఁడని దలఁపవలెననిగాని నీవు పండితుఁడవను సుఖము నీకుఁగలుగవలెననిగాని నేర్వకుము. వివేకియే వివేకముతోఁ బరులకు సహాయముఁ జేయఁగలఁడని తెలిసి చదువుము. ఇతరులకు సహాయము చేయ నీవెంత కోరినను నీకు జ్ఞానము లేని యెడల నీవు చేయఁగలుగు మేలు కంటె కీడెక్కువ చేయ వచ్చును.

సత్యమునకు అనృతమునకు వివేచనము చేయవలెను. మనోవాక్కాయములచే నంతటను సత్యముగ నుండుట నేర్చుకొనుము.

మొదట మానసికమగు సత్యమును నేర్చుకొనుము. ఇది సులభము గాదు. అసత్యములగు తలంపులును అవివేకములగు మూఢాభిప్రాయములు లోకమున నెన్నియో గలవు. అట్టి యభిప్రాయ

ములచేఁగట్టఁబడినవాఁడు వృద్ధికి రాఁజాలఁడు.
కాఁబట్టి యనేకు లొక విధమునఁ దలఁచెదరను కా
రణముంబట్టియే, యామాట నంగీకరింపకుము.
మఱియు పెక్కు వందల సంవత్సరముల నుండి యొక
మాటనమ్ముచు వచ్చినారనిగాని, ప్రమాణగ్రంథ
మని లోకు లెంచు నెద్దియో యొక గ్రంథమున
వ్రాయఁ బడియున్నదని గాని దానిని నమ్మకుము.
ఆ విషయము నీవే పరిశీలించి యిది యుక్తమా
యని నీవే నిశ్చయించుకొనుము. వేలకొలఁది
జనులొకవిషయమును గుఱించి యేకాభిప్రాయము
గలిగి యుండినను వారా విషయముఁ దెలియని
వారుగ నుండినచో వారి యభిప్రాయము నిష్ప్ర
యోజనమను దానిని మఱువకుము. మోక్షమార్గ
మున నడువఁగోరువాఁడు తనంతట తాను తెలిసి
కొన నేర్చికొనవలయును. మూఢాభిప్రాయము
లనునవి లోకమునందలి చెడుగులలో మొదటి

తరగతిలోఁ జేరినవి. కనుక నాబంధమును బూర్ణ
ముగఁ దొలఁగించుకొనుము.

మఱియు నితరుల విషయమున నీ యభిప్రాయ
ములు సత్యములుగ నుండవలయును. ఇతరులను
గుఱించి నీకుఁ దెలియని దానిని నీవు తలఁపరాదు.
వార లెల్లపుడును నీ విషయమే తలఁచుచున్న
వారని యెంచకుము. ఎవరుగాని యొక కార్యము
చేసినచో దానివలన నీకుఁ గీడు గలుగునని నీవు
తలఁచినను, వారాడు మాటలు నీకన్వయించునని
నీవు తలఁచినను, వెంటనే యాతఁడు నిన్ను చెఱు
పఁదలఁచెనని యెంచకుము. శతశః ఆతఁడు నిన్నుఁ
దలఁచకయే యుండవచ్చును. వారి వారి కష్టములు
వారలకుండనే యున్నవి. వారు తమ విషయములనే
ముఖ్యముగఁ జింతించుచుందురు. ఎవ్వడుగాని కోప
ముతో మాట్లాడినచో నిన్ను ద్వేషించెననిగాని ని
న్ను నొప్పించ నిచ్ఛయించెననిగాని యెంచకుము.

బహుశః ఎవ్వఁడో యెద్దియో ఆతనికి కోపము తెప్పించియుండి ఆసమయమున నీ వెదుటఁబడుట చే నా కోపము నీమీఁదఁ ద్రిప్పియుండవచ్చును. అతండు తెలివి లేకయే ప్రవర్తించుచున్నవాఁడు. కోపమంతయు తెలివి లేనిదే కదా. అయినను వాని విషయమై నీవసత్యముగఁ[1] దలఁపఁగూడదు.

నిన్ను పరమగురుఁడు శిష్యుఁడుగ నంగీకరించి నపుడు నీ మనోభావముల నతని భావములతో నెల్లపుడు సరిపోల్చి చూచి నీ భావముల సత్యతను పరిశీలించఁ బూనుము. గురుశిష్యులొక్కటియే కావున శిష్యుడు తన భావములను బరమగురుని భావములతో చేర్చి చూచి రెండును చేరునో లేదో వెంటనే తెలిసికొనవచ్చును. చేరనియెడల తన మనోభావములే తప్పు గావున వానిని వెంటనే మార్చుకొనును. పరమగురువున కంతయుం దెలియుటంబ

[1] అనఁగా నిన్నుఁ జెఱుపఁదలఁచెనని.

ట్టి వారి మనోవృత్తులు శ్రేష్ఠముగదా! పరమగురు
నిచే నంగీకరింపఁబడని శిష్యుఁడింత బాగుగ చే
యఁజాలఁడు గాని వాఁడు "పరమగురువు దీని
నేమనుకొనును? ఇట్టి సమయమున నేమి చెప్పును?
ఏమి చేయును?" అని పలుమాఱు నిలిచి యో
చించుచుండుట వానికి మిగుల సహాయకర
ముగ నుండును. ఏలయన పరమగురువు చేయునని
నీకుఁ దోఁచరాని పనిని నీ వెపుడును చేయరాదు.
వారాడుదురని నీకుఁ దోఁచరాని మాటల నీ
వెప్పుడు నాడరాదు. వారు దలఁతురని నీకు
తోఁచ రానిదాని నీవెప్పుడును దలఁపరాదు.

నీ వాక్కును సత్యముగ నుండవలయును. ఉన్న
ది యున్నట్లు పలుకవలయును. అతిశయోక్తులుండ
రాదు. పరులపై దురుద్దేశ్యముల నెన్నఁడు గాని
యారోపింపకుము. వారి మనస్సున నున్నది వారి
పరమగురువునకే తెలియును. వారి నడవడికిఁ

గారణము నీ మనస్సున స్ఫురింపకయే యుండవచ్చును. ఏవరిపైన గాని యొక మాట వింటివేని దానిని మరల నాడకుము. అది సత్యము కాక యుండిన నుండవచ్చును. సత్యముగ నుండినను దానిని మరల నాడుటకంటె నూరకుండుట దయచూపినట్లగును. యథార్థముకాని మాట నోటవచ్చునేమో యని భయము గలిగి చక్కఁగా నాలోచించి మాటలాడుము.

చేయు పనులయందును సత్యముగ నుండుము. నీ లోనున్న దానికంటె వేఱుగ నున్నట్లు నటింపకుము. అట్టి నటనలన్నియు నిర్మలమగు సత్యజ్యోతికిఁ బ్రతిబంధకములు. స్వచ్ఛమగు నద్దములో నుండి సూర్యకాంతి ప్రకాశించునటుల నీ మూలముగ సత్యజ్యోతి ప్రకాశించవలెను గదా !

స్వప్రయోజనమునకును పరోపకారమునకును గల భేదము వివేచనము చేయవలయును. స్వప్ర

యోజనము పెక్కు రూపములు దాల్చును. ఒక రూపమున దానిని దుదముట్ట నాశనము చేసితినని నీ వనుకొనుచుండఁగా నింకొక రూపమున నెప్పటి వలనే యది దృఢముగఁ బుట్టును. అయినను క్రమ క్రమమున పరోపకారచింత నీ మనంబుననిండి, నీ స్వవిషయము చింతించుటకు నీకు సందు సమయముగాని లేకయే పోవును.

వివేచన నింకను నొకవిధమునఁ జేయవలయును. అందఱును అన్నియును, పైచూపున కెంత చెడ్డఁగ గనఁపడినను వానియందుండు నీశ్వరుని వివేచనముచేసి చూడ నభ్యసింపుము. నీకును ఇతరునికిని సమానముగా నుండుదాని మూలమున నీవు వానికి సహాయము చేయ నోపుదువు. మీయందు సమానముగ నుండునది భగవత్కళ. ఆ భగవత్కళ నీ సోదరునకు దెలియునట్లు బోధించి యాకళను వ్యక్తమగునట్లు చేయ నభ్యసింపుము.

అట్లయిన నీసోదరుని తప్పుదోవనుండి కడ తేర్చఁగలుగుదువు.[1]

---

## II

## [2]నిష్కామత్వము.

అనేకులకు నిష్కామత్వమును సాధించుట కష్టము. వారు తమ తమ కామములే తామని తలఁచెదరు[3]. కావున వారికి నైజములుగ నుండు

[1] అందఱియందు నీశ్వర కళ యున్నదిగదా! వారి వారి రుచి ననుసరించి యీశ్వరుఁడు వారికిఁ బురోవృద్ధిమార్గ మేర్పఱచుచుండును. వారిమార్గ మెఱింగియే వారికి మేలుచేయవలయును. మనమార్గమునకే వారిని ద్రిప్ప యత్నింపరాదు.

[2] దీనినే వైరాగ్యమని వేదాంతులు వాడుదురు.

[3] కామమయోఽయం పురుషః = ఈ పురుషుడు కామమయుఁడు అని చెప్పియుండలేదా.

కామములను వారి రాగ ద్వేషములను తీసివేసినచో వారలయందేమియు మిగిలియుండదు. అయినను వారు పరమగురువును జూడని వారలుగనే యుందురు. ఆమహనీయుని పావనమగు సన్నిధియను వెలుఁగుండినచో వారివలె కావలెనను కోరిక యొక్కటి తప్ప తక్కు కోరిక లన్నియు నశించును. ఐనను వారిని బ్రత్యక్షముగఁ జూచు సుఖము నీకుఁ గలుగుటకు ముందే, నీవు వలయునన్న నిష్కామత్వమును సాధించవచ్చును. జనులు తఱచుగ గోరు ధనైశ్వర్యములు మొదలగునవి పొందఁదగినవి కావని వివేకముచే నీ కిదివఱకే తెలిసియున్నది. ఇది నోట జెప్పుట మాత్రము చాలదు. యథార్థముగ నది నీ మనస్సు నంటినచో వానికై నీకుండుకోరికలు తుదముట్ట నశించును.

ఇంతవఱకంతయు సులభము. నీవు దీనిం దెలిసికొనుట మాత్రమే చాలును. అయినను స్వర్గ

మును గోరియేగాని, తమకుమాత్రము బంధమోక్షమై జన్మరాహిత్యము కావలయునని కోరియేగాని యైహికార్థములను విడుచువారు కొందఱుగలరు. నీవీ పొరబాటునఁ బడఁగూడదు. నీవు నిన్ను బూర్ణముగ మఱచియుండినచో, నీకు బంధనివృత్తి యెపుడు గలుగునోయని గాని లేక నీకెట్టి స్వర్గము గలుగునో యనిగాని చింత నీకుండఁజాలదు. స్వప్రయోజనము కోరు కామమంతయు నెంత గొప్ప విషయమును గూర్చినదైనను, బంధకమే యను దానిని మఱువకుము. దానిని నీవు బోఁగొట్టుకొనునంతదనుక, పరమగురువు కార్యమునకై నిన్నుసమర్పించుకొనుటకు పూర్ణమగు స్వాతంత్ర్యము నీకుండదు.

నీవిషయములగు కామములన్నియు బోయినను నీవు చేయుపనివలనఁ గలుగు ఫలము నీవు చూడవ

లెనని కోరిక నిలిచి యుండవచ్చును. నీ వెవరికైనను సహాయము చేసినచో, నీవు వాని కెంత సహాయము చేసితివో యని చూడఁగోరుదువు. వాఁడును దాని నెఱిఁగి కృతజ్ఞుఁడుగ నుండవలయునని గూడ నీవు కోరినను కోరుదువు. ఇదియును కామములోఁ జేరినదియే గాక నీకు నమ్మకము లేదనియును సూచించును. ఇతరులకు సహాయమునకై నీశక్తిని ధార పోసినచో, నీవు చూడంగలిగినను లేకపోయినను, దాని ఫలము గలిగియే తీరవలెనుగదా! భగవదాజ్ఞను గనియుంటివేని ఇదిసిద్ధమని నీకు తెలియును గదా! ధర్మమును పరిపాలించుట కొఱకే ధర్మమును జేయవలయునుగాని, ప్రతిఫలము నపేక్షించి చేయరాదు. పనిచేయుట ధర్మమనియే పని చేయవలయును గాని ఫలమును జూడఁగోరి చేయరాదు. నీకు లోకముపైఁ బ్రేమగలిగియుండుటచే లోకమున కుపచరించుటకు నిన్ను నీవు సమర్పిం

చుకొనక తప్పదనియెఱింగి లోకసేవకు నీవాత్మ నివేదనము చేసికొనవలయును.

అణిమాదిసిద్ధులను బొందఁగోరకుము. అవి గలుగుట నీకు మేలని పరమగురువున కెన్నఁడు తెలియునో అపుడవి నీకువచ్చును. పరిపక్వముగాక మునుపే వానిని గలుగు నట్లు చేసికొనినచో, వానిచే పెక్కులు తొందరలు గలుగును. మోసగాండ్రగు క్షుద్రదేవతలా సిద్ధులు గలవానిని దఱచుగఁ దప్పుత్రోవల కీడ్తురు. లేక వాఁడహంకారియై తాను పొరబాటు పడఁజాలనని యెంచికొనును. అది యెట్లుండినను, వానిని సాధించుటకు వలయు కాలమును, బలమును, ఇతరులకై పనిచేయుటయందు వినియోగ సఱుపవచ్చును. మనుజుఁడు పరిపక్వము కానుకాను అవి వచ్చును. రాక తప్పదు. అంతకంటె ముందు నీ కవి గలుగుట యుపయోగకరమని పరమగురువుకుఁ దోఁచినచో

నిరపాయముగ వాని నే విధమున నీవు పొందఁగలుగుదువో దానిని వారు నీకుఁ జెప్పుదురు. అంతదనుక నీ కవి లేకుండుటయే మేలు.

మఱియు దినచర్యయందుఁ గొన్ని యల్పకామములు సామాన్యముగఁ గలుగును. వాని విషయమై మెలఁకువతో నుండుము. లోకమున నీవు ప్రకాశించ వలెననిగాని, చమత్కారమును జూపనుగాని యెన్నఁడును కోరకుము. మాటలాడవలయునను కోరికను విడువుము. కొంచెము మాటలాడుట మంచిది. నీవు చెప్పఁగోరునది సత్యమును, ప్రియమును, ఉపకారకముగ నున్నదని నీకు దృఢనిశ్చయముగఁ దోఁచువఱకు నేమియు మాటాడక యుండుట దానికంటె మంచిది. నీ వాడఁబోవు మాట యీమూఁడుగుణములఁ గలిగియున్నదా లేదా యని జాగరూకతతో యోచించి అట్లుకానిచో నామాట నాడకుము.

మాటాడుటకు ముందు జాగరూకతతో నాలోచించుట నిప్పటినుండియే వాడుక చేయుట మంచిది. ఏలయనఁగా నీవు పరమగురువు నొద్ద మహోపదేశమును బొందిన పిదప చెప్పరానిది యెద్దియైనను చెప్పుదు నేమో యని ప్రతి మాటయును పరిశీలించ వలసి యుండును. లోకులాడుకొను మాటలు చాలమట్టుకనావశ్యములుగను అవివేకములుగను నుండును. ఇతరుల విషయమై వృథా ప్రసంగములైనప్పుడు ఆమాటలు దుర్మార్గములే యగును. కావున నీవు మాటాడుటకు మాఱుగ ఇతరులు చెప్పుమాటల నాలకించుటను వాడుక చేసికొనుము. నిన్నుఁ బ్రత్యేకముగ నడిగినఁగాని నీయభిప్రాయముల పైబడి చెప్పకుము. మోక్షసాధనముల స్వరూప మిట్లని యొకచోట నిరూపింపఁబడియున్నది — తెలిసికొనుట, సాహసించుట, మనోనిశ్చయముచేయుట,

మానముగ నుండుట యని. ఈనాల్గింటిలోఁ గడపటిది యన్నింటిలో కష్టమైనది.

ఇతరుల పనులయందు వ్రేలు పెట్టఁగోరుట సామాన్యమగు మఱియొక కోరిక. దీనిని నీవు ఖండితముగ నణఁచుకొనవలయును. మఱియొకఁడేమి చేయునో, యేమిచెప్పునో, యేమి నమ్మునో అనునది నీపనిగాదు. వాని యిష్టానుసారముగ పోను పూర్తిగా వానిని విడుచుటకు నీవు నేర్చుకొనవలయును. వాఁడితరుల కడ్డమురాక యుండునంతవఱకు, వాఁడు దలఁచు తలంపులకును, ఆడుమాటలకును, చేయుపనులకును, వాఁడు సర్వస్వతంత్రుఁడు. నీకు యుక్తమని తోఁచునట్లు చేయుటకు నీవు స్వాతంత్ర్యమును కోరుచున్నావు గదా! వానికి నట్టి స్వాతంత్ర్యము నియ్యవలయును. వాఁడా స్వాతంత్ర్యమును వినియోగించినపుడు వానిని గుఱించి మాట్లాడుట నీకు ధర్మము గాదు.

వాఁడు తప్పుచేయుచున్నాఁడని నీకుఁ దోఁచినచో, తగుసందర్భమును గుదుర్చుకొని, యేకాంతమున, వినయముతో, నీ కట్లుతోఁచుటకుఁ గారణముల వానికిం జెప్పుము. అప్పుడు వాఁడు నీయభిప్రాయము సరియని యొప్పిన నొప్పవచ్చును. అయిన నింతమాత్రమైనను బ్రవేశించుట యనుచితముగనేర్పడు సమయము లనేకములు గలవు. అదియెట్లుండినను, నీ వెన్నఁడుగాని మూఁడవవానియొద్దకుఁ బోయి యామాటల సల్లాపముగ నాడఁగూడదు. ఏలయన నది మిగుల దుర్మార్గమైన పని.

పిల్లలనుగాని పశువులనుగాని యెవరైనను హింస చేయుటఁ జూచితివేని నీవడ్డముపోవుట నీకు ధర్మము. దేశపుఁ జట్టములకు విరోధముగ నెవరైన వర్తించినచో నీవు దాని నధికారులకుఁ దెలుప వలయును. ఎవరినైనను బోధించుటకు

నీస్వాధీనమున నుంచినచో వాని తప్పులను మృదువైన మాటలతో వానికిఁ జెప్పుట నీధర్మము గావచ్చును. అట్టి సందర్భములందప్ప నీపని నీవు చూచుకొనుచు మౌనవ్రతము నభ్యసింపుము.

---

## III

## సదాచారము

(శమాది షట్కము)

సదాచారమునకు ముఖ్యముగ వలయు నంశములాఱు పరమగురు వీరీతిని జెప్పిరి. ఏవియన—

1. మనోవిషయమగు నిగ్రహము.
2. కాయికకర్మవిషయమగు నిగ్రహము.
3. భిన్నరుచుల సహనము.
4. సంతోషము.

5. ఏకాగ్రత.

6. విశ్వాసము.

[సాధన చతుష్టయము వలెనే వీనిలో కొన్ని తరుచుగ వేరు పేళ్లతో[1] పిలువబడుదాని నే నెఱుగుదును. అయినను నా కుపదేశించినపుడు పరమగురువు స్వాంతముగఁ జెప్పిన పేర్లనే, అంతటను నే నుపయోగించుచున్నాను.]

1. మనోవిషయమగు నిగ్రహము.—నిష్కామత యనుసాధనముచే కామమయశరీరమును నిగ్రహించవలయునని దెలియుచున్నది గదా ! ఈ సాధనము మనోమయశరీరనిగ్రహమున కన్వయించును. మనోనిగ్రహమనఁగా, నీకుఁ గోపముగాని, యాతురముగాని లేకయుండునటుల నీ స్వభావ

[1] 1 శమము=అంతరింద్రియ నిగ్రహము. 2 దమము=బాహ్యేంద్రియ నిగ్రహము. 3 ఉపరతి=సన్న్యాసము. 4 తితిక్ష=తాలిమి. 5 సమాధానము. 6 శ్రద్ధ.

మును నియమనము చేయుట యొకటి. ఎల్లప్పుడును శాంతము కలిగి కలవిలపాటునొందకుండునటుల మనస్సునే నిగ్రహించుట రెండవది. స్థూలశరీరమందలి [1]నాడులయందు సాధ్యమైనంతవఱకు కలత పుట్టకయుండునటుల మనస్సుద్వారా నా

[1] మనోమయకోశమున కలతపుట్టఁగా దానివలన స్థూలశరీరమునందుండు నతిసూక్ష్మములగు నాడులలోను కంపనము గలుగును. ఆనాడులు సమముగ చలించుచుండునంతవఱకు, కాయిక వ్యాపారములన్నియు సులభముగను, సుఖముగను, జరగుచుండును. విశేషకోపము, కామము, భయము, దిగులులోనగునవి మనంబునఁ బొడమఁగా, సూక్ష్మశరీరమున స్పందము [అదరుపాటు] గలుగుటయే గాక, స్థూలశరీరపు నాడులయందు నయితము బలమగు కంపముగలిగి శరీరమునంతయు బడలునట్లు చేయును. శరీరమంతయు చెమటపట్టుట, రక్తహీనమయినట్లు తెల్లబాఱుట, వణకుట, గగుర్పాటు, డగ్గుత్తిక మొదలగులక్షణములన్నియు నీ నాడులయందలి కంపమువలననే గలుగునవి. ఆట్టివి కాకుండునటుల నిగ్రహించవలయును.

ములను నిగ్రహించుట మూఁడవది. వీనిలో మూఁడవది కష్టము. ఏలయన, నీవు మోక్షమార్గమును సాధింపబూనినపుడు నీశరీర మతి సూక్ష్మగ్రాహి కాక తప్పదు. అప్పుడెద్దియైన నొకశబ్దము విన వచ్చినఁగాని అదురుపాటు గలిగినఁగాని నాడులతి సులభముగఁ గలఁతఁజెందును. మఱియు ఎంతమాత్రమైన నొత్తుడు దగిలినచో నది మిగుల చులుకు గాఁదగులును. ఐనను నీవు చేతనైనంత యత్నము చేయవలయును[1]

శాంతమగు మనస్సున్నచో ధైర్యముగూడ నుండవలయునని యర్థము. ధైర్యమువలన మోక్షమార్గమున నీకుఁ గలుగు పరీక్షలను, కష్టములను

[1] అనఁగా నెన్ని కష్టములువచ్చినను ఎవరెన్నిమాట లాడినను, ఏమి చేసినను, నీ శరీరమును, ఇంద్రియములను, మనస్సును కలఁతఁజెందక శాంతముగ నుంచుకొనుటకు బహు ప్రయత్నము చేయవలయును.

నీవు భయములేక నెదురించగలుగుదువు. మఱియు స్థైర్యముగూడ నుండవలయును. అది యుండినచో అందఱికిఁ గలుగు కష్టములను నిర్లక్ష్యముగఁ జూడఁగలుగుదువు. మఱియు లోకులనేకులు స్వల్ప విషయములను గుఱించి యెడతెగని మనోవ్యథను పెట్టుకొనునట్లు నీవు పెట్టుకొనక తప్పించుకొనఁ గలుగుదువు. వెలుపటినుండి మనకు సంభవించున దొకింతయు ప్రయోజనము లేనిదని పరమగురువు బోధించుచున్నాఁడు. మనకు వచ్చుదుఃఖములు, కష్టములు, రోగములు, నష్టములు, వీనినన్నిటిని తృణీకరించవలెను. వానివలన మనశ్శాంతిని చెడ నీయఁ గూడదు. అవి పూర్వకర్మఫలములు. అవి వచ్చినపుడు వానిని నీవు సంతోషముతో నోర్చు కొని చెడుగంతయు నస్థిర మనియును, ఎల్లప్పుడును ఆనందమును నెమ్మదిని గలిగియుండుట నీ పని యనియును దెలియుము. అవి యన్నియు నీ పూర్వ

జన్మమునకుఁ జేరినవి. ఈ జన్మమునకుఁ జేరినవి గావు. వానిని నీవు మార్పఁజాలవు. కావున వానిని గుఱించి చింతించుట నిష్ప్రయోజనము. దానికంటె నీవిపుడు చేయుదానిని గుఱించి యోచించుము. దానినేమో నీవు మార్పఁగలవు. దానిచే నీకు రాఁబోవు జన్మమునఁగలుగు ఫలము లేర్పడును.

ఎప్పుఁడుగాని దుఃఖమును ఖేదమును పైకొననీయకుము. ఖిన్నుఁడవై యుండుట తప్పు. ఏలయన నా ఖిన్నత యితరులకును వ్యాపించి, వారికుండు కష్టములను హెచ్చించును. అట్లు చేయుట నీకు ధర్మముకాదు. కావున నీకెప్పుడేని ఖిన్నత వచ్చెనేని దానిని వెంటనే తొలఁగఁద్రోసి వేయుము.

మఱియు నింకొకవిధమున నీ మనస్సును నిగ్రహించ వలయును. దానిని విచ్చలవిడిగ సంచరించ

నీయరాదు. నీ వేమిచేయుచున్నను దానిఁమీఁదనే మనస్సునుంచి ఆపనిని లోపము లేక యుండునట్లు చేయుము. నీ మనస్సు నూరక యుండ నీయకుము. మనస్సునకు వ్యాపారములేని సమయమున మనస్సునం బ్రవేశించుటకు సిద్ధముగ నుండునటుల, నంతరంగమున సత్సంకల్పముల నెల్లప్పుడును జేర్చి యుంచుము.

నీమనశ్శక్తిని ప్రతిదినమును మంచిపనుల యందు వినియోగింపుము. లోకపురోవృద్ధికి సహాయుఁడవగుము. దుఃఖపడుచున్నవాఁడనిగాని, కష్టపడుచున్నవాఁడనిగాని, సహాయముకావలసియున్నాఁడనిగాని నీకుఁదెలిసిన వారిలో నొకరిని ప్రతిదినము స్మరించి నీమనస్సునుండి ప్రేమను వారిపైఁ గ్రుమ్మరింపుము.

నీ మనస్సును గర్వమునుండి మరలింపుము. ఏలయన గర్వ మజ్ఞానమునుండి పుట్టునది. తెలి

యనివాఁడు తాను గొప్పవాఁడ ననియు తానేదో గొప్పకార్యముల చేసితిననియుఁ దలఁచును. జ్ఞానవంతుఁడు భగవంతుఁ డొకఁడే గొప్పవాఁడనియు, మంచిపని యంతయు భగవంతునిచేతనే చేయఁబడుచున్నదనియును దెలిసికొనును.

2. కాయికకర్మనిగ్రహము—నీ మనసుండవలసిన రీతినుండెనేని కాయికకర్మ విషయమై నీకంత కష్టముండదు. ఐనను లోకుల కుపయోగ కరముగ నుండవలసెనేని మనోవృత్తుల ననుసరించి కార్యము చేయవలయుననుటను మఱువకుము. సోమరితనముఁగూడదు. ఎడతెగక సత్కర్మములయందు పాటుపడుచుండవలయును. ఐనను నీవుచేయునది నీకు విధింపఁబడినపనిగానే యుండవలయునుగాని యితరులు చేయవలసిన పనిగానుండరాదు. ఇతరుల యనుమతితో వారలకు సహాయమగునట్లు మాత్రము వారిపనియును చేయఁదగును. ప్రతి

మానవుని తన తన పనిని తనదోవన చేయనిమ్ము. సహాయము కావలసినపుడు సహాయముచేయుటకు సిద్ధముగ నుండవలెను గాని ఎప్పుడు గాని వారి పనులలో నడ్డము దూరకుము. తాముచేయవలసిన పనినే తాము చూచుకొని యుండుటను నేర్చుకొనుట లోకులలో ననేకులకు కష్టము లన్నింటిలోఁ బెద్దకష్టము. దాని నేర్చుకొనుటయే నీ ముఖ్యమయిన పని.

గొప్పకార్యములఁ జేయఁబూనెద నను కారణమున, నీవు చేయఁదగు సామాన్యములగు కార్యములను చేయుట మఱువరాదు. ఏలయన, నా పనులనన్నింటిని నెరవేర్చునంతదాఁక వేఱుకింకర్యము చేయుటకు నీకు స్వాతంత్ర్యము లేదు. క్రొత్తవి యగు నైహికకార్యముల నీపై మోపుకొనకుము. ఇదివఱకే నీవు వహించిన కార్యముల నే మోపూర్ణముగ చేసి తీరవలెను. అవి యెవ్వి

యనఁగా, స్పష్టముగను, న్యాయముగను నీకు విధింపఁబడినవని నీమనస్సునకుఁ దోఁచునవి గాని యితరులు నీ పనులని యెంచి నీ పైనారోపింపఁ జూచునవి గావు. నీవు పరమగురువు వాఁడవుగ నుండవలయునన్న, నీవు చేయుసామాన్యపుపని నితరులకంటె మేలుగా చేయవలయునుగాని కీడుగఁ జేయరాదు. ఏలయన దానింగూడ నీవు పరమగురువు ప్రీతికొఱకే చేయ వలయును.

**3. భిన్నరుచులసహనము.**[1]—అందఱియెడలను పూర్ణమగు సహనము గలిగి యుండవలయును. నీ

1 పురాతనగ్రంథములయం దిది యుపరతి యనఁబరఁగు. ఉపరతియన సన్న్యాసమని యా గ్రంథములయందు నిరూపింపఁబడియున్నది. అట్లనినఁ దనకు విధించియుండు కర్మములు విడుచుటయని సామాన్యముగ నర్థము చేయుదురు. తాత్త్వికముగ బాహ్యకర్మములను విడుచుటయే ముఖ్యముగాదు. అంతస్సన్న్యాసమే ముఖ్యము. అంతస్సన్న్యాస మనఁగా స్వాత్మాభిమానమును విడిచి సర్వ

మతమునందు నీకు మనః పూర్తిగ నుండు విశ్వాస
మును ఇతర మతముల వారు నమ్ము మతసిద్ధాంత
ముల యందును నీవు పూర్ణముగ నుంచవలయును.
ఏలయన నీ మతమువలనే వారి మతమును బరమగతి

త్యాగము చేయుట. అది గలవాఁడు బాహ్యకర్మము
లయం దభిమానముంచఁడు. నానా దేశములయందును,
వివిధ మతములయందును దేశకాలానుగుణముగ నాచార
భేదము లుండినను వానియన్నింటివలని పారమార్థిక ప్ర
యోజనమును మాత్రము చూచుచు బాహ్యభేదములను
గమనించక అందఱియందును సకలవిధాచారములయం
దును సమబుద్ధి గలిగియుండును. ఇదియే భిన్నరుచి సహ
నము. ఇదియే యుపరతి. ఇదియే సన్న్యాసము అట్టి
సన్న్యాసము గలవాఁడు బాహ్యకర్మములను జేసినను జేయక
సన్న్యసించినను లెక్కలేదు. నిజమయిన సన్న్యాసియే
యగు. అట్టి వారల నుద్దేశించియే శ్రీకృష్ణభగవంతులు
"అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః, స
సన్న్యాసీచ యోగీచ ననిరగ్ని ర్నచాక్రియః" అను
గీతాశాస్త్రమున ఆఱవ యధ్యాయము ప్రథమశ్లోకమున
స్పష్టముగ సన్న్యాస శబ్దమును నిర్వచించియున్నారు.

కి మార్గమే. అందఱకును సహాయుఁడవుగావలెనని
స నీ వందఱి విషయమును దెలిసికొనియుండవలెను.

ఐనను ఈ పూర్ణమగు సహానము నీకుఁ గలుగ
వలెనన్న, నీవు మొట్టమొదట పాషండత్వము
నుండియు, మూఢాభిప్రాయముల నుండియు
దొలఁగవలయును. కర్మములు నీ కనావశ్యకములని
యెఱుంగ వలయును. లేనియెడల నాకర్మములఁ
జేయని వారికంటె నేదోవిధమున నీవు శ్రేష్ఠుఁడ
వని యెంచుకొందువు. అట్లైనను, కర్మముల నిం
కను పట్టుకొనియుండువారల నిందించరాదు.
వారియిష్టము చొప్పున వారిని జేయనిమ్ము. అయి
నను తత్త్వము నెఱింగియుండు నీకేమో వారడ్డము
రాఁగూడదు. నీవు గడచి దాఁటినదానిని నీచే బలా
త్కారముగఁ జేయించుటకు వారలును బూన
రాదు. అన్నిటికి నెడమిచ్చి ప్రవర్తింపుము.
అన్నింటియెడ దయాపరుఁడవై యుండుము.

నీవిపుడు కన్నులు తెఱచి చూచుచుండుటచే పూర్వము నీవు నమ్ముచుండిన కొన్ని విషయములును, నీవు చేయుచుండిన కర్మములును వ్యవస్థలేనివని నీకగపడవచ్చును. వాస్తవముగ నవి యటులనే యుండునేమో సుమా ! నీవు కర్మముల నికమీద ననుష్ఠింప జాలకపోయినను, అవి కొందఱు సత్పురుషులకు నింకను ముఖ్యములుగనుండును గావున వారికై యాకర్మముల గౌరవింపుము. అవి యుండఁదగిన చోట్లున్నవి. వానివలన నుపయోగము సయితమున్నయది. నీవు పసివాఁడవుగనుండినపుడు, చక్కని గీతలు రెండుగీచి వాని నడుమ వ్రాయుటచే, వంకరలులేకయు, పొంకముగను వ్రాయుటకు ఆగీతలు నీకు సహాయములుగ నుండినను తర్వాత నాగీతలు లేకయే మఱియు నెంతయో బాగుగాను ధారాళముగను వ్రాయ వచ్చిన వెనుక నవియేల! ఆ నమ్మకములును కర్మములు

నాగీటులవంటివి. అవి నీకును కావలసిన సమయ ముండెను. ఆసమయ మిప్పుడు దాటిపోయెను.

మహాగురుస్వాములొక రిట్లని వ్రాసిరి:—“నేను బాలుఁడుగనుండినప్పుడు బాలునివలె మాటలాడితిని. బాలునివలె తెలిసికొనుచుంటిని. బాలునివలెనే తలంచుచుంటిని గాని పెద్దవాఁడనుకాఁగా పసితనపుఁ బనులను వదలివేసితిని.” అయినను తనబాల్యమును మఱచిపోయి, బాలుర సుఖదుఃఖములను దెలిసికొనలేనివాఁడు బాలురకు బోధింపఁజాలఁడు. వారలకు సహాయము చేయనేరఁడు. కావున నెవఁడుగాని, బౌద్ధమతస్థుఁడైన నేమి, హిందువైన నేమి, జైనమతస్థుడైననేమి, హీబ్రూమతస్థుఁడైన నేమి, క్రైస్తవుఁడైన నేమి, మహమ్మదీయుఁడైన నేమి, యందఱిని నొక్కటే విధమున దయతోడను, మార్దవముతోడను, సహనము గలిగియు చూడవలయును.

4. సంతోషము.[1]—నీకర్మయెట్టిదైనను సరే, దానిని సంతోషముతో భరింపుము. కష్టములు సంభవించుట యనునది నీకు గొప్ప గౌరవమని భావింపుము. ఏలయన కర్మఫలప్రదాతలగు మహానుభావులు దాము సహాయముచేయుటకు నిన్నుఁ దగినవానిగ నెంచుచున్నారని సూచించుచున్నది. అదియెంత కఠినముగ నుండినను, అంతకంటె కఠినముగ లేదుగదా యని సంతసింపుము. నీ దుష్కర్మము ననుభవముద్వారా తీరిపోయి నీకు బంధము దెగునంతదనుక నీవు పరమగురువునకు ప్రయోజకుఁడవు గావనుట మఱువకుము. నీవు పరమగురువున కాత్మనివేదనము చేసికొంటివిగావున, నీకర్మమును బైఁబడి రమ్మని కోరితివి. అందువలన, నూఱుజన్మ

[1] వేదాంతులు దీనిని తితిక్ష యందురు. సంతోషము తితిక్షలో నుత్తమావస్థ. సంతోషము తితిక్ష యందంతర్భూతమై యున్నది.

ములందుఁ గొంచెముగ ననుభవింపదగిన కర్మమేని
నీ వొకటి రెండు జన్మములలో తీర్చుకొనుచుదువు.
అది సంపూర్ణముగ తీరిపోవలెనన్న దానిని సంతు
ష్టుఁడవై యుల్లాసముతో భరించవలయును.

మఱియు నొకయంశ మేమన—ఏదిని 'నాది'
యనుకొనుట బొత్తిగా విడువవలయును. నీ కర్మ
ముచే నీకెక్కువ మక్కువ గలవస్తువులును నీ వెక్కు
డుగఁ బ్రేమించువారును నిన్నుండి తొలఁగి
పోవచ్చును. అట్టిసమయమునందును నీవు సంతో
షము గలిగి, దేనినైనను సరే, అన్నిటినైన సరే
విడుచుటకు సిద్ధముగ నుండవలయును. పరమ
గురువు దనసేవకుని మూలమున నితరులకుఁ దన
శక్తిని ధారపోయు సందర్భములు గలుగును. సేవ
కుఁడు ఖిన్నతకు లోబడియుండిన వారట్లుచేయ
నోపరు. కావున సంతోషము సహజముగ
నుండవలయును.

5. ఏకాగ్రత.[1]—నీపరమగురువుపని చేయవల యుననునది యొక్కటియే నీవు లక్ష్యముగ నుంచుకొనవలయును. నీవు మఱియేమి చేయవలసి వచ్చినను వారిపని నేమో యెప్పుడును మఱువరాదు. అయితే వారిపనితప్ప మఱియొద్దియు నీకుఁబ్రాప్తించ నేరదు. ఏలయన, ఇతరులకు సహాయకరమై స్వప్రయోజనము నపేక్షించని పనియంతయు పరమగురువు పనియేగదా! అట్టిపనిని నీవు వారికర్పణముగఁ జేయవలయును. అట్టిపనులలో నొక్కొక్కటియు నీవు చేయుచో, దానిని బాగుగ గమనించి యది నీచేత నైనంత బాగుగానుండు నట్లు చేయుము. అదే మహాగురుస్వాములే మఱియు నిట్లని వ్రాసిరి—"నీవెద్ది చేసినను, అది మానవులకు గాదు, భగవంతునికని దానిని మనఃపూర్తిగఁజేయుము." పరమగురువప్పుడే వచ్చి

[1] దీనిని సమాధానమని వేదాంతులందురు.

చూచునని నీకుఁదెలిసినచో నీ వాకపని నెట్లు
జేయుదువో యోచించి నీవు చేయుపని నంతయు
నా రీతిననే చేయవలెను. అందరికంటె నెక్కుడు
జ్ఞానము గలవారలే పై వాక్యమునందలి యర్థ
మును బూర్ణముగఁ దెలిసి కొందురు. దాని
కంటెను మిగుల ప్రాచీనమగు మఱియొక
వాక్యము దానివంటిదియున్నది. అదియెద్దియన
“ నీచేతికిఁ దగులుపని యెద్దియేగాని, దాని నీశక్తి
నంతను వినియోగించి చేయుము.”

ఏకాగ్రత యన నీవు ప్రవేశించిన మోక్ష
మార్గమునుండి నెద్దియైనను నిన్నొక క్షణమైనను
మరలింపరాదనియు నర్థమగును. నిన్ను మోహిం
పఁచేసి తప్పుత్రోవలం(దిప్పు సందర్భములు గాని
ఐహికసుఖములుగాని, ఐహికములగు ప్రేమలైన
నుం గాని, నిన్ను మరల్పఁజాలియుండరాదు. ఏల
యన నీ వీమార్గముతో నేకీభవించవలయును. అది

నీకు సహజమై, దానిగురించి యోచింప నక్కర లేకయే దాని నవలింబించునట్లును, దానినుండి మరలుట నీకసాధ్యముగనుండునట్లును కావలయును. అంతరాత్మయగు నీవు ఆమార్గమునఁ బ్రవేశింప నిశ్చయించితివి. దానినుండి త్రెంచుకొని పోవుటయన నిన్నుండి నీవు త్రెంచుకొని పోయినట్లగును.

6. విశ్వాసము [1]—నీ పరమగురువును విశ్వసింపవలెను. నీ యందును నమ్మకముండవలెను. నీవు పరమగురువును చూచియుండినచో జననమరణము లెన్ని గడచినను నీకు వారియందు పరిపూర్ణమగు నమ్మకము గలిగియుండును. వారిని నీవింకను చూచియుండక పోయినను వారి స్వరూ

[1] ఇది శ్రద్ధయని వేదాంతు లందురు. గురువేదాంత వాక్యములయందు పరమవిశ్వాసమని చెప్పుదురు. గురువిశ్వాస మీగ్రంథమందు చెప్పబడియున్నది. వేదాంతవాక్యముల సారము నేనంతరాత్మయని తెలియుటయేకదా!

షము ననుభవమునకుఁ దెచ్చుకొనఁ బూని వారిని నమ్మవలెను. లేనిచో వారైనను నీకుఁ దోడ్పడ నేరరు. పూర్ణమగు నమ్మకముండినగాని వారి ప్రేమయు శక్తియు పూర్ణముగఁ బ్రవహింపఁ జాలవు.

నీయందు నీకు నమ్మక ముండవలయును. నీ విషయమై నీకు చక్కఁగఁ దెలియునని యనుకొనెదవేమో! అట్లెంచినచో నీవిషయము నీకుఁ దెలియనే తెలియదు. పలుమాఱు బురదలోఁబడిన[1] దుర్బలమగు పైపొట్టునుమాత్రమే నీవెఱుఁగుదువు. యథార్థముగ నీవన్ననో భగవంతుఁడను నగ్నినుండియే వెలువడిన యగ్నికణమవు. సర్వశక్తిమంతుఁడగు భగవంతుఁడు నీయందున్నవాఁడు. ఆ కారణముంబట్టి, నీవు చేయనిశ్చ

[1] అజ్ఞానమయమగు సంసారములోఁబడి శోకమోహములకు లోఁబడునది యని యర్థము.

యించినచో నీ కసాధ్యమగునది యొక్కటియు లేదు. "ఒక మనుజుఁడు చేసినదానిని మఱియొకఁడు చేయఁగలఁడు. నేను మనుజుఁడనే. అయినను నేను మనుజునందుండు భగవంతుఁడను గూడ. ఈ పనిని నేనుచేయఁగలను. నేను చేసితీరెదను." అని నీకు నీవు చెప్పుకొనుము. ఏలయన నీవీమోక్షమార్గమున నడువ వలయునన్న నీమనో నిశ్చయము బాగుగఁదీరిన యుక్కువలె నుండ వలెను.

---

## IV

## ప్రేమ [1]

సాధనములన్నింటిలో ప్రేమ అతి ముఖ్యము. మానవునకుఁ బ్రేమయనునది దగినంత దృఢముగ

[1] వేదాంత గ్రంథములయం దిది ముముక్షుత్వమని వాడఁబడుచున్నది. ముముక్షుత్వమనఁగా మోక్షేచ్ఛ—జననమరణ

నుండినచో నది వానిని నిర్బంధముగ తక్కు-
సాధనముల నన్నింటిని సాధించునట్లు చేయును.
ప్రేమ లేనియెడలఁ దక్కినవన్నియు నెప్పటికిని
జాలవు. దీనిని, జననమరణరూపమగు చక్రము
నుండి మోక్షమునకును, భగవంతునితో నైక్యము
పొందుటకును తీవ్రమగునిచ్ఛయని తరుచుగ నిర్వ
చింతురు. అయినను అట్లు చెప్పుట స్వప్రయో
జనపరత్వమును సూచించుచు దానియర్థములోఁ
గొంతభాగమునుమాత్రమే తెలుపును. అది
కోరిక యనుట యంత సరికాదు. దృఢసంకల్ప

రూపమగు సంసారదుఃఖమునుండి విముక్తుఁడు గావలయునను
తీవ్రమగు నిచ్ఛ. అజ్ఞానమునుండియు, తత్కార్యములగు శోక
మోహములనుండియు విడువఁబడవలయు నను కోరిక. ఐహిక
ములు నాముష్మికములు నగు విషయములయందుండు ప్రేమను
వదలి పరమేశ్వరునొక్కరినే ప్రేమించి, వారి సన్నిధింజేరఁ
గోరుటయే ముముక్షుత్వము. దీని నిపుడు పరమగురువులు
ప్రేమయని నిరూపించియున్నారు.

ము, అధ్యవసాయము, మనోనిశ్చయము అని చెప్పవచ్చును. దాని ఫలము నీకుఁ గలుగవలయు ననినచో నా మనోనిశ్చయముతో నీయంతరంగము నిండి మఱి యొకటి మనస్సున స్ఫురించుటకు నవ కాశము లేనట్లుండవలయును. యథార్థముగ నది భగవంతునితో నేకీభావము పొందవలయు నను నిశ్చయమే గాని నీవు వేసటను దుఃఖమును తప్పించుకొనవలయునని నీవేకీభావమును కోర రాదు. వారి యందలి గాఢప్రేమచే, వారికితోడుగా వారు వర్తించునట్లు వర్తించవలయునని కోర వలయును. ఏలయన, భగవంతుఁడు ప్రేమస్వరూపుఁడు. కావున నీవాయనతో నొక్కటిగఁ గావలసినచోఁ, బరిపూర్ణముగఁ బరోపకార బుద్ధియు పరమప్రేమయు నీయందు నిండియుండవలయును.

ఈ ప్రేమయనునది దినచర్యలో రెండువిధములుగ నేర్పడును. మొదట నీవు జాగరూకతో నే

ప్రాణికిఁగాని బాధచేయక యుండవలెను. రెండ
వది—ఇతరులకు సహాయముచేయుటకు నెల్లప్పు
డును సమయమును నిరీక్షించుచుండవలయును.

మొదటిది బాధచేయకుండుట. ప్రేమకు విరో
ధములగుటంబట్టి లోకమునందలి పాపములన్నిం
టికంటె నెక్కుడు చెరుపుచేయు పాపములు మూఁ
డున్నయవి. అవియెవ్వియన, లోక వార్తల వృథా
ప్రసంగము, క్రౌర్యము, మూఢాభిప్రాయములు.
భగవంతునియందలి ప్రేమ తన యంతరంగము
నిండియుండవలయునని కోరువాఁడు యీమూఁటి
యెడ నెడతెగక కాచియుండవలెను.

వృథాప్రసంగ మెంతపనిచేయునో చూడుఁడు.
దానికి మూలము దుస్సంకల్పము. అదియే యొక
పాపము. ఏలయన, అందఱియందును అన్నింటి
యందును మంచియున్నది. మంచి తలంచి మంచిని
బలపరచి లోకపురోవృద్ధికి మేలు చేయగలము.

చెడుగును దలంచి దానిని బలపరచి లోకపురో వృద్ధికి భంగము చేయగలము. అనఁగా భగవ దిచ్ఛననుసరించి చేయగలము, లేక దాని నెదిరించ గలము. మఱియొకనియందలి చెడుగును నీవు దలఁచితివేని యేక కాలమున మూఁడు పాపములఁ జేసియుంటున్నావు. అవి యెవ్వియనిన—

(1) నీ చుట్టుప్రక్కల నంతయు మంచి మనో భావములతో నించుటకు మాఱుగా, దుష్టమనో భావములతో నిండింతువు. అందుచే లోకమునం దలి దుఃఖమును హెచ్చింతువు.

(2) ఆమనుష్యునియందు నీవు దలఁచిన దు ర్గుణముండినచో దానిని నీవు బలపఱచి పోషిం తువు. అందుచే, నీసోదరుని మునుపటికంటె మంచివానిగఁ జేయుటకు మాఱుగా, వానిని ముందుకంటె చెడ్డవానిగఁ జేయుదువు. అయితే సాధారణముగ నాదుర్గుణము వానియందుండదు.

ఉన్నదని నీ కెటులనో తోఁచియుండును. అట్ల
యినచో నీదుస్సంకల్పము నీసోదరునిఁ దప్పు
త్రోవల నీడ్చును. ఏలయన, వాఁడింకను పరి
పూర్ణుఁడు గాకయుండినచో వాఁడు నీవు భావిం
చిన గుణములుగల వాఁడగును.

(౩) నీస్వంతమనస్సును సత్సంకల్పములతో నిం
చుటకుమాఱుగ దుస్సంకల్పములతో నించుకొను
దువు. కావున నీయభివృద్ధికి నీవే యడ్డము వేసికొం
దువు. చూడఁగలవారు [1] నిన్నుఁ జూచినచో నీవు
రమణీయముగను ముద్దుగనుండుటకు మాఱుగా,
వికారముగను, దుఃఖకరముగను గనఁబడుదువు.

ఇట్లు వృథాప్రసంగములఁ జేయువాఁడు తన
కును, తానుఁ జెఱుపఁబూనినవానికిని ఇంతకీడు

[1] చూడఁగలవారన బాహ్యదృష్టితో స్థూలశరీరమునుఁ జూచువారుగాదు—యోగదృష్టితో సూక్ష్మశరీరమునుజూడఁ గలవారని యర్థము.

చేసియుఁ దృష్టిఁజెందక యితరుల సయితము తాను జేయు నేరములో భాగులుగఁ జేయుటకుఁ దన శక్తినంతయు జూపియత్నించును. తన దుర్మా ర్గపుఁ కథను ఇతరులు నమ్ముదురు గాకయను కోరికతో నుత్సాహమున నితరులకుఁజెప్పును. అంతట వారును దమ దుస్సంకల్పములను దుర్బ లుఁడగు నా కష్టజీవిపైఁ గ్రుమ్మరింతురు. ఇట్లు దినదినమునను, ఒక్కఁడేగాక వేలకొలఁది జనులు చేయుచుందురు. ఈపాపమెంత నీచమో యెంత ఘోరమో నీకు కొంచెమైనను ఇపుడు స్ఫురిం చుచున్నదా? దానిని బూర్ణముగ మానుకొన వలయును. ఎవరినిగూర్చిగాని కీడెన్నఁడును మాట్లాడకుము. ఎవరైనను మఱియొకరినిగుఱించి చెడ్డమాటలాడినను, దానిని వినక నిరాకరించి వారితో:—“ఒకవేళ నిది నిజము కాదేమో! నిజముగనుండినను దానిని గుఱించి మాటలాడక

యుండుట మాట్లాడుటకంటె దయచూపినట్లు గునుగదా!" యని మృదువుగ జెప్పెను.

ఇకఁ గ్రౌర్య మెట్టిదనిన:—అది బుద్ధిపూర్వకము, అబుద్ధిపూర్వకము అని రెండువిధములు. అందు బుద్ధిపూర్వకమనునది మఱియొక ప్రాణికి బాధఁగలుగఁ జేయవలయునని యుద్దేశించి చేయునది. అది పాపములన్నింటిలో గొప్పది. అది మనుజుఁడు చేయఁదగినదిగాదు. దయ్యము చేయఁదగిన పనియని చెప్పవచ్చును. మనుజుఁడెన్నఁడు గాని యట్టిపనిని జేయఁడని యందువేమో! మనుజులు పలుమా ఱట్టిపనిని చేసియున్నారు. ఇప్పుడును బ్రతిదినమునను చేయుచున్నారు. పూర్వ క్రైస్తవపాఖండములోఁ గొందఱు "రోమన్ క్యాథలిక్" (Roman Catholics) మతస్థులిట్లు హింసించిరి. మఱియుననేకులు మతాభిమానులు మతముపేరుపెట్టి యిదేపనిని చేసియున్నారు.

ఇప్పుడును గొందఱు వైద్యశాస్త్రశోధకులు దేహ తత్త్వమును పరీక్షించుటకని ప్రాణిహింస చేయుచున్నారు. ఉపాధ్యాయులలో ననేకులు వాడుకగా నీపనిని జేయుచున్నారు. వీరందఱు నీ హింస తమకాచారముగ నేర్పడినదని తమ ఘోరకర్మమునకు సమాధానము చెప్పుకొనఁబూనుదురు. పాపకార్యమనేకులు చేయుటనుబట్టి యది పాపకార్యము గాకపోదు. మనకర్మగతియును నది యాచారమును సరకుగొనదు. క్రౌర్యమనున ది కర్మములన్నింటిలో ఘోరమైనది. ఇండియా దేశమునన్నైనను నిట్టియాచారముండుట కాస్పదముండరాదు. ఏలయన, నచట నహింసాధర్మ మందఱికును దెలిసినదియ. మృగయావినోదమని పేరు పెట్టి భగవంతునిచే సృజింపఁబడిన జీవకోటిని వేఁటాడి బుద్ధిపూర్వకముగ హింసించిన వారందఱు క్రౌర్యమువలని ఫలము ననుభవింపక తప్పదు.

ఇట్టిపనులను నీవుచేయవని నేనెఱుఁగుదును. భగవంతునియందు నీకుఁగలప్రేమనుబట్టి యిట్టి పనులఁ జేయరాదని యవకాశము గలిగి నప్పుడితరులకు స్పష్టముగఁజెప్పుచుందువు. కార్యములందుఁ గ్రౌర్యముండునటులనే, మాటలయందును గ్రౌర్యము గలదు. ఎవ్వఁడైనను మఱియొకని నొప్పించ నుద్దేశించి యొకమాట బలికినచో వాఁడీ పాతకముఁ జేసినవాఁడగును. ఆపాపమును సయితము నీవు సేయవు. అయినను బుద్ధిపూర్వముగ నాడుమాటవలన నెంతచెఱుపు గలుగునో అంత చెఱుపు యోచించక యాడుమాటవలనను గలుగవచ్చును. కనుక నబుద్ధిపూర్వకముగ గ్రౌర్యముచేయుదువేమోయని జాగరూకుఁడవై యుండుము.

ఈ యబుద్ధిపూర్వకమగు క్రూరకర్మము సాధారణముగ యోచనలేమిచే సంభవించును. లోభ

ము, ధనకాంక్ష, వీనితో నిండిన వాఁడు న్యాయ
ముగ నితరులకియ్యవలసిన దానికంటెఁ దక్కువగ
నిచ్చుటచేతను, తన యాలు బిడ్డల కరకష్టము
నకు పెట్టుటచేతను దాను గలుగఁజేయు కష్ట
మింతయని యొకప్పుడైన యోచనయైనను చే
యఁడు. మఱియొకఁడు తనకామము తీర్చు
కొనుట యోచించి, దాని నీడేర్చుకొనుట యం
దెందఱు జీవులను ఎన్ని దేహములను [1] నాశనము
చేయునో యించుకయైనను సరకుగొనఁడు. ఇం
కొకఁడు కొద్దినిమిషముల శ్రమను దప్పించుకొను
టకై, తనవలనఁ దనపనివాండ్రకుఁ గలుగు కష్ట
ముల నెంతమాత్రము యోచించక, వారలకు జీత

[1] పాపకార్యములం బ్రవేశపెట్టుటచే జీవులకుఁ గీడు చేయును. దుర్మార్గమునం బ్రవర్తింపఁజేయఁ, బరలోకమునఁ గలుగు పాప ఫలము గాక నిచ్చటసయితము వెంటనే శరీర ముల వ్యాధిగ్రస్తములుగఁజేసి, శరీరములకుఁ గీడుగలుగఁ జేయును,

మియ్యవలసిన దినమున నాజీతముల నియ్యఁడు. మనముచేయు కార్యమువలన నితరుల కెంత కష్టము గలుగునోయని మనము యోచింపక మఱచుటచే నింతకష్టము గలుగుచున్నది. కర్మవిధి కేమో మఱపు లేదు. లోకులు మఱచి పోవుదురనుటను క్రొంచెమైనను సరకుగొనదు. నీవు మోక్షమార్గ మున బ్రవేశింపఁగోరితి వేని యోచించక నెద్దియేని క్రూరకార్యమును చేయుదువేమోయని భయము గలిగి, నీవు చేయుపనిచేఁ గలుగు ఫలములన్నింటిని యోచించ వలయును.

మూఢాభిప్రాయములుఁ గలిగియుండుట మఱి యొక గొప్ప చెడుపు. ఇది ఘోరమగు క్రౌర్యమును విశేషముగఁ గలుగజేసియున్నది. దీనికిలోనై యుండువాఁడు, వానికంటె నెక్కువ తెలిసినవారిని దిరస్కరించి బలవంతపెట్టి తానుచేసినట్లు జేయింపఁ బూనును. పశువులను బలియిచ్చి తీరవలెనను

మూఢాభిప్రాయముచేతను, మనుజునకాహారముగ
మాంస మవశ్యముగ కావలయునను సంతకంటెను
నెక్కుడు క్రూరమగు మూఢాభిప్రాయము చేతను,
ఘోరమగు పశువధ యెంత చేయఁబడుచున్నదో
యోచింపుఁడు. మనకత్యంత ప్రేమాస్పదమగు
నిండియా దేశమున, మూఢాభిప్రాయమువలన
నంత్యజులయెడ మనము నటించురీతిని యో
చింపుము. సోదరభావము కలిగి యుండుట
ధర్మమని తెలిసిన వారియందు సయితమీ
దుర్గుణమెట్టి కఠినమగు క్రౌర్యమును గలుగఁ
జేసియున్నదో చూడుము. ఈ మూఢాభిప్రా
యమను దయ్యముచేతఁజిక్కి ప్రేమస్వరూపుఁ
డగు భగవంతుని పేరుచెప్పుచు ననేక పాతకములు
సేయఁబడియున్నవి. కావున నాపాతకము నణు
మాత్రమైనను నీయందు నిలువనట్లతి జాగరూకుఁ
డవై యుండుము.

ఈ గొప్పపాపముల మూఁడింటిని నీవు విడువవలెను. ఏలయన, నవి శ్రేయమునకు విరోధములు గావున నవి పురోవృద్ధిని చెరుచును. అయితే నీవు కీడుఁ జేయక యుండుటమాత్రము చాలదు. మేలును బూనికతోఁ జేయుచుండవలయును. లోకసేవఁ జేయువలయునను నతి తీవ్రేచ్ఛ నీయందుఁ బూర్ణముగ నిండియుండవలెను. నీచుట్టుపట్టుల నుండు మనుజులకు మాత్రము గాదు. పశువులకు నోషధులకుం[1] గూడ సేవచేయుట కవకాశము దొరకునాయని మేలుకొనుచు నెల్లప్పుడు నిరీక్షించుచుండవలయును. నీవు ప్రతిదినమును స్వల్ప విషయములయందే లోకసేవఁ జేయుచుండవలయును. అట్లయినచో లోకసేవఁ జేయుట నీస్వభావముగ నేర్పడి గొప్పపనిఁ జేయ నవకాశ మరుదుగ దొరికి నపుడు దానిని బోఁగొట్టుకొనక యుండఁగలుగు

[1] వృక్షములు, లతలు, గుల్మములు, లోనగునవి.

**దువు.** ఏలయన, నీవు భగవంతునితో నేకీభావము నొందవలయునను తీవ్రేచ్ఛ నీ స్వప్రయోజనమున కుఁగాదు. భగవంతుని ప్రేమ లోకమునందుండు ప్రజలకు ప్రవహించుటకు నీవొక మార్గముగ కావలయునని యేకీభావమును గోరవలయును.

మోక్షమార్గమున నుండువాఁడు బ్రతికియుం డుట తనకొఱకుగాదు. ఇతరులకై బ్రతికియుం డును. ఇతరులకు సేవచేయుటకై తన్నుఁ దా మఱచియుండును.[1] పేనాయొకటి చేతఁబట్టి దాని తోవ్రాయుటచే మనోభావములు వ్యక్తములుగఁ జేయఁగలము. ఆ పేనా లేనియెడల నామనోభావ ముల వ్యక్తముగ చేయఁజాలముగదా! అటులనే భగవంతుని సంకల్పములు ప్రవహించి యీలోక మున నభివ్యక్తము గావలయుననిన, నీమోక్ష మార్గముననుండువాఁడు భగవంతునిచేతి పేనా

[1] పరోపకారబుద్ధిచే దనకార్యములను మఱచిరయే పోవును.

వలెఁ గావలయును. ఇంతియకాదు. ప్రాణముగలిగి
జ్యోతిర్మయమగు నగ్నిశిఖయుంబోలి, వాఁడు తన
హృదయమున నిండియుండు నీశ్వరసంబంధమగు
ప్రేమను లోకముపై నంతయు కిరణములవలె
ప్రసరింపఁజేయుచుండును.

నీకువలయు సాధనము లెవ్వియనిన:—సహాయ
ము జేయ శక్తినిచ్చు విజ్ఞానము మొదటిది. ఆవిజ్ఞా
నమును మంచిత్రోవలనడుపు మనోనిశ్చయము
రెండవది. ప్రోత్సాహముచేసి ఆనిశ్చయమును
పుట్టించు ప్రేమ మూఁడవది. మనోనిశ్చయము,
విజ్ఞానము, ప్రేమ యను నీమూఁడును భగవం
తునికి మూఁడుముఖములు. భగవంతుని సేవకుల
జేరఁగోరు నీ వీమూఁడుగుణములను లోకమున
వెల్లడిగ చేయవలయును.

---

Printed by J. R. Aria at the Vasanta Press, Adyar, Madras.

ఓం

వేచియుండును సద్గురు వచనమునకు.
చూచుచుండును గుప్తమౌ జ్యోతి కొఱకు.
యుద్ధరంగము మధ్యను ఓర్పుతోడ,
గురువునాజ్ఞను వినుటకై కోరుచుండు.

జనసమూహము నందైన కనగనేర్చు
వారి యతిసూక్ష్మసంజ్ఞను వైళముగను.
జనులు మహితోరు వాద్యము ల్సలుపుచుండ
పరమ గురువుల గుహ్యమౌ పలుకువిందు.